

శ్రీ రస్తు.

శ్రీ గురవేనమః

# శ్రీ సిద్ధేశ్వర శతకము.



ఇది

గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా, రాయవరము
గ్రామ కాపురస్తుండును, శ్రీ చిదంబర గురుస్వాములవారి,
శిష్యుండును, పద్మశాలి కులసంభవుండును,
గుర్రము వీరయ్య తృతీయ పుత్రుండును, నగు

## కోటయాఖ్య కవిచే

రచింపంబడినది.

మొదటి కూర్పు 1

గుంటూరు

అనసూయ ముద్రాక్షరశాల యందు

ముద్రింపబడెను.

1933.



శ్రీరస్తు.

శ్రీగురవేనమః

# శ్రీ సిద్ధేశ్వర శతకము.

శా॥ శ్రీవైకుంఠశివాఖ్య దేవవిలసచ్చిన్మాత్రతత్త్వంబవై
భావంబందున మానిబృందములునిన్ భక్తిన్ సన్నుతుల్ గొల్వగా।
గోవిందప్రభుసద్యసుస్థిపున్కై కోర్కెల్ నీరానన్నన్
శ్రీవర్ధాడమువాదసేవకుడ నీభూతిన్ బ్రశంసించెదన్ ॥

గురుస్తుతి.

శా॥ శ్రీమార్తాండసుకాంతి యొప్పభువిలో జెన్నొందిప్రఖ్యాతిగా।
భూమానందచిదాత్మ కేవలమహాపూర్ణుండవై వెల్గుచున్
నీమంబొప్పగ నాన్నసింహసుతుడై నిష్ఠాత్ముడై యెప్పుడున్
కామాదుల్ నిరసించి శిష్యజనులన్ పాడుచున్నట్టియా
శ్రీమంతుండు చిదంబరార్యగురునిన్ సేవింతున ముదున్ ॥

రాయవరపురాఖ్యగ్రామమున | జన్మమునుద్భవించి
యతిశయముగ | వరచిదంబరార్యపురహరాంశజుడైన
గురునిపాదములను గొలుతుమనిశీ ॥

ఉ॥ పన్నగభూషణాంశజుడు ఫాలవిలోచనుడబ్జజూటుడున్ |
పన్నగహారముల్ గలుగు, పాపవిదూరుడటంచు సజ్జనుల్ |
మన్నన సేయుచుండ హరమాధవులన్ | దగబోతి వెల్గుచున్ |
విన్నపముల్ | వెసన్ వినుచు | వేగ మొసీనుల బ్రోచుచున్నయా|
పన్ను చిదంబరార్యగురుపాదములన్ | మదిలో భజించెదన్ ॥

క॥ అట్టిమహామహాపదములు । పట్టి వెసన్ గొలుచునట్టి ।
భక్తులుమిగులన్ । ముట్టుదురిహాపరసుఖముల ।
గట్టిగఁ దా మొందరెపుడు । కష్టములెల్లన్ ॥

ఉ॥ శంకరభక్తమానసవశంకర విశ్వముదుర్మతంబులన్
సంకటవృత్తినున్నముని సంఘముగన్గొని । మిమ్ము వేడగా
పొంకముతో చిదంబరసుమూర్తిని సర్వమునుద్ధరింపనీ
వంకజనించిభక్తజనభారము దీర్చితివయ్యబ్రోవుమా ॥

ఉ॥ పన్నగభూషణుండు పరిపంథిజనాంతకు డార్యరాజ్య
సంపన్నుడు భక్తపోషణుడు । పాపవిదూరుడు । ధీరబుద్ధియౌ।
వెన్నెలరేణితాల్పు జనవిశ్రుతనాముడు శంకరుండుధీ ।
సన్నుతి శ్రీచిదంబరవిశారదుడన్ ననుబ్రోచుగావుతన్

గీ॥ భక్తిలేకున్ననీదగుపరమనామ । సుధయుగల్గెడినట్లునో
సోమమకుట । ఆజ్ఞయివ్వంగలేవెయనాథనాథ ।
భక్తరక్షణ దీనాళిపాలివాడా ॥

విఘ్నేశ్వర స్తుతి.

క॥ శంకరతనయా గజముఖ । శంకలు బాపంగలేన శాంతిసుమూర్తి ।
వంకలు నెన్నక దయతో పొంకంబుగ జూడవయ్య బుధజనవంద్యా ॥

క॥ కందర్పజనకవాహన । వందనములు జేతు నీకు వైభవమొప్పన్ ।
కందళితహృదయమొప్పగ । పొందుగ దరి జేర్చునను । బుధజనవినుతా ॥

క॥ శ్రీమద్వేదాంతాచల । భూమచిదానంద తీర్థపూజ్యపదమునన్
నీమముగనిలచియుందురు । ధీమహితులు నిరతముగను ।
దివ్యతరముగన్ ॥

ఆంజనేయ స్తుతి.

శా॥ పారావారముదాటి లంక కెలమిన్ । బల్ వేగమొప్పారగా।
శ్రీరామాజ్ఞనుబోయి । యచ్చటను వేసీతాసతిన్ గాంచియా
నారీరత్నముతోడ । రామునికథల్ నానెంబుగా దెల్పియున్
యాజ్ఞామున్ గనుమారుతాత్మజుని । సేవ శ్రాంతమున్ గొల్చెదన్ ॥

గీ॥ వాయుపుత్రుండు కేసరీవరసుతుండు । శ్రీకరుండు సుధీరుండు
చిరజయుండు । భానుకోటి తేజుండ సమానబలుడు ।
మించు వేడుక మమ్మురక్షించుగాక ॥

క॥ పాపమేఘపటల పవనుండు శాంతుండు । కేశవంశజుండు కీర్తిఘనుడు।
కోర్కెలొసగువాడు గురుజనవినుతుండు । అట్టి
ఆంజనేయునభినుతింతూ ॥

సరస్వతిస్తుతి.

గీ॥ శ్రీసరస్వతినిన్ను నాచిత్తమందు। భాసమానంబుగా
గొల్తుభక్తితోడ । నీసమానులు లేరమ్మనిఖిలమునను ।
వాసిమీరగనన్నేలు వాణిపుడమి ॥

దేవిస్తోత్ర్యము.

సీ॥ యేదేవతాశక్తి వేదశాస్త్రంబులకుతల్లియై భువిలోన దనరుచుండు।
యేదేవతాశక్తినెరిగి కాత్యాయని యుండి భూతంబుల చెండివైచు ।
యేదేవతాశక్తి నెరిగియు విష్ణుండురక్షించు భక్తులరాజితముగ ।
యుదేవతాశక్తినెరిగి హిరణ్యగర్భుండు బుట్టించునీభువనములను ॥
గీ॥ యిట్టి నీపాదపద్మంబులింపుమీర । స్మరణజేసెద నెప్పుడు సరసతోడ।
నమ్మియుండెద నెదలోన నాశముగను । పరమకళ్యాణినుంగళ
ప్రభలువెలుగ॥

కవిస్తుతి.

క॥ కవివరుడగువాల్మీకిని । సువిశారదువ్యాసుపద్యసుష్టునక్తియూ ।
భువిలోతిక్కనపోతన । నసురిశముగ తలతుమనని
సంతోషమునన్ ॥

కవివంశావళి.

సీసమాలిక॥ శ్రీకరణీవంశశేఖరంబా శ్రీతకల్పకవృక్షమనగా జెలంగె।
సత్యమందున హరిశ్చంద్రుడై సీతెండ్రిరాణించె వెంకయ్యరమ్యమూర్తి
పతిహితంబున నరుంధతిబోలె నీతల్లియఘునై ఛిదుర శ్రీయచ్చ
మాంబ । నీయన్నసూర్యధాత్రి నగడెనయ్యల్లయ్య వితరణకర్ణుడై విరి
విగాను । నవమన్నధునిబోల నలువందునీతమ్ముడవనిలో కృష్ణయ్య

ప్రవిమలుండు । సంధ్యావళీదేవి సదృశయై రాణించె రామలక్ష్మమ్మ సారసదళాక్షి । నీకుకొమారులు ప్రాకటధన్యులుమూర్తి త్రయాసములు ముఖ్యులరయ। హనుమయ్య వెంకయ్య అనువంద కోటయ్య సత్కీర్తిఁజెందిరి సంతసమున । నీకుకోడండ్రునై నిర్మలచిత్తులై వరిల్లి రత్యంతవైభవమున । సిరివిగాకోటమ్మ వేంకటరామమ్మ లచ్చమ్మలన మించులలితముఖులు । నీకుకొమార్తెలు నిర్మలహృదయులై కాత్యాయనీసమ ఘనతజెంది । అంతమ్మ బాలకోటమ్మ అచ్చమ్మయు। పరమార్థసంగతుల్ భక్తిమీర । నీగురువర్యుడై నెగడెను పరశివ వరచిదంబరమూర్తి వాసిమీర । నీయుశంబునకోడి నీలవర్ణముగలిగి ముక్కవంచెనుగదా మొదటిగిబ్బ । నీపరాక్రమమునకోపకసింహంబు । యొదిగెచుగుహాల నిల్లిదిగో చూడు ॥

గీ॥ నీకుసరిదాతలేడు భూలోకమందు । పద్మశాలికులంబున ప్రభలితీవు। వార్ధిగంభీర్యగుర్రమువంశవర్య । నయజనవిధేయ వీరయ్య నామధేయా ॥

వ॥ అట్టివీరయ్యకు జన్మించిన పుత్రులలో ప్రధమ పుత్త్రుండగు హనుమయ్యకు జన్మించిన సుపుత్రులు

గీ॥ అనఘవేంకటరాముఁడు యనగబరగు । బాలుడాతండు శాంతుండు పాఠశాల । కేగివిద్యనునేర్పుతో యింపుమీర । చదువుచున్నాడు ప్రీతితో సరసులలరా ॥

వ॥ వెండియు చినవెంకటరాములసంబరగి వరిల్లుచుండె ॥
మరియు ద్వితీయ పుత్రుండగు వెంకయ్యకు జన్మించినపుత్రుడు॥

క॥ శ్రీరాములనుచుపేరొక్కని । గారాబముగాను పిల్లకాయతనమునన్। ధీరతనాటలపాటల । చేరిమెలంగుచును దిరుగు చిరుతునిమాడ్కి॥

వ॥ తృతీయపుత్రుండగు కోటయ్యకు జన్మించిన పుత్రిరామలక్ష్మమ్మ యను నామంబునయొప్పుచుండె । యీ వీరయాఖ్యునకు జన్మించిన పుత్రులలో తృతీయపుత్రుండనగు నేను ॥

ఉ॥ వారలలోన చిన్ననయి వర్ధిలువాడను కోటయాఖ్యుడన్ । ధీరుడనాను సంఘమును జేకువగొల్చెడువాడభక్తుడన్ ।

నేరచియింపఁబూనితిని నిర్మలమానస శ్రోత్రపాత్రముల్ ।
నేరనులక్షణంబెపుడు నేనిక నాగురుమూర్తిసత్కృపన్ ॥

—: శివస్తుతి :—

క॥ శ్రీరజతాచలవాసుని । కోరిభజించెదను నాదుకోర్కులుమీరన్ ।
నేరుపుతో యాసత్కృప । భారకుడవునీవెయుంచు భజియింతుశివ॥

శ్రీరజితగిరినివాసా । పరమేశ । సింధుగంభీర యాశా ।
మారసంహారశశధరా । కృపతోడ । మమ్మేలుసిద్ధేశ్వరా॥ 1
పన్నగాహారమూలు । యురమునను । భానుకోటిప్రకాశమై ।
యున్ననీచందమరసి । భావింపనొప్పునే సిద్ధేశ్వరా ॥ 2
గరళంబుకంఠమందు । నిడుకొని । సురలరక్షించలేదా ।
పరిపూర్ణుడవునీవుగా । నిన్నెంచ । తరమానె ॥సి॥ 3
భువనమోహనరూపకా । శ్రీకర । భక్తులను నెడబావవే ।
ధవళనేత్రగిరీశ్వరా । తేజాల । ధనదశ్రీ ॥సి॥ 4
దాసదాసుడనంటినీ । నీదాస । దాసుండనై యుంటిని ।
వాసిగా నన్నుబ్రోవుమా । తేజాల । వాసశ్రీ ॥సి॥ 5
మరణకాలమునందునా । నిన్నుపుడు । స్మరణచేతునో చేయనో ।
శరణితో నీనామము । నేనిపుడు । స్మరియింతు ॥సి॥ 6
ఈదేహమందె కానీ । మోక్షంబు । యేదేహమందు లేదూ।
నీదరినిజేరువాడా । తేజాల । నిటలాక్ష ॥సి॥ 7
ఘోరపాపాచలములు । నీకృప । కలిశాహతిన్ దాకినా ।
దూరముగపరుగెత్తవే । వ్రక్కలై । ధూర్జటి ॥సి॥ 8
శివనీమహాత్మ్యము కా । మున్మునులు । జేయుమహాపాపముల్ ।
భువిని మెటులెవదలునో । యనుచింత । బుట్టునో ॥సి॥ 9
అండపిండాండంబులు । నీలోన । నిండియుండె వెశంకరా ।
దండిఅంబుధిలోనవల్ । ప్రబలముగ । యుండునటు ॥సి॥ 10
కన్నతండ్రివినీవనీ । నినుచాల । కాంక్ష చేతను వేడగా ।
మున్ను మార్కండేయుని । బ్రోవవా । మోదమున ॥సి॥ 11
పదబాహులనుగల్గగా । నవియెల్ల । వదలకను నీ సేవకూ ।

విదితముగనుండగాను । సేవింప పదిలముగ సిద్ధేశ్వరా ॥ 12
దోశిలాగ్గినవాడనూ। నేజేయు। ద్రోహముల నెంచబోకూ
వాశిగానన్నేలవే। రజతాద్రి। వాస ॥ శ్రీసి॥ 13
నీదయకు పాత్రుడాను। నీలగళ। నీవెదిక్కని నమ్మితీ।
యేదైవములనైనను, నే నెరుగ। నింపుతో ॥సి॥ 14
యెంతబిల్చిన బల్కవు। భవ యీశ। యేమి జేసితి నేరము
చింతలన్నియు బాపియు। నన్నేలు శీఘ్రముగ ॥సి॥ 15
వదలగను రావణుండు। దుష్టుడై। మదమునను రజతగిరినీ।
కదలించనదిగాంచియు। నణచవా। పదమునను॥సి॥ 16
గజచర్మధారివీవు। నీకాంత। కాళికాదేవి చూడు।
సుజనవందిత వేడెదను। నామదిని। నిజముగా ॥సి॥ 17
కోటిసూర్యులకాంతితో। జెలువొంది। ధాటిమీరగ వెల్గెదు।
మేటికైలాసమందు। నుండెదవు। దీటుగను సిద్ధేశ్వరా॥ 18
ప్రమథగణములు నిరతము। నినుచాల। ప్రస్తుతింపగ శంకరా।
వామాంకముననుండెదు। గిరిజతో వర్తిలుదు॥సి॥ 19
చిన్నితనమున క్షీరముల్। గ్రోలినటు। లున్న నీపదతీర్థముల్
యెన్నివిధముల గ్రోలినా। తృప్తిలే దెన్నటికి సిద్ధేశ్వరా॥ 20
నలుదిక్కులును నీవెగా। చిద్రూప। నాథుండ వేనీవుగా
పలువిధంబుల నీకథల్। వినుచుండి। బరగెదను॥సి॥ 21
కాలకంధరశంకరా। నేను నీ పాలబడితిని బ్రోవరా।
యేలనాపై కోపము। శ్రీకంఠ నీలగళసిద్ధే॥ 22
దూరభారముజూడకా। నినుబహుగ దూరనాడినవాడరా ।
ధీరుండవని తెల్యగా। తేరాల దివ్యమా ॥సి॥ 23
నవమాసములు మోసియు। మాజనని భువిపైని నను వేయుగా।
అవిరళంబగు కష్టముల్। జెందితిని అవనిలో సిద్ధేశ్వరా॥ 24
ముట్టి ఓంకారంబున। నుండియు బుట్టె నొక పెనుభూతము।
నెట్టుకొని దాని మధ్య। జగతియును బుట్టెహర ॥సి॥ 25
శక్తిస్వరూపంబున। త్రైమూర్తులు జననమొందిరి వేగ మే ।
శక్తిదానై యుండెనూ। భువనముల్ సాగకను ॥సి॥ 26

మూలంబులేనిజగతీ। రెప్పుడు నిర్మూలమైపోవంగనూ।
కాలంబులను మీరియు। సంతతము గలుగుదువు॥సి॥ 27

యది మాయయనుచు నాదు।మనమునను నెప్పుడును దలచుచుండీ
వదలకను నీసేవలో। నిరతంబు వర్తింతు ॥సి॥ 28

కలిమాయలక జిక్కియు। నరకమను వలలో వ్యథజెందుచూ।
పలుమార్గములుగానక।మోహాంధ బాధచే॥సి॥ 29

శివశంభో మృత్యుంజయా। పరమేశ శ్రీకంఠ సురపూజితా।
భవత్ర్యంబక శంకరా। దేవనను పాలించు ॥సి॥ 30

యెంతనిర్దయగల్గినా। ననుజోవ పంతమా శివశంకరా।
సంతోషముగనూర్పవే। నీపాద సాక్షిగను ॥సి॥ 31

పూర్వమందాదిమునులు। నిన్గూర్చి సర్వమయుడవటంచునూ।
పర్వతనివాస నిన్ను వేడరా। భర్గహర ॥సి॥ 32

గినమందారుండవు। పోషింప శక్యనీవేశంకరా।
పూనిలోకములన్నియు। నీవెగద భూతేశ ॥సి॥ 33

దేవదానవులెల్లను గుమిగూడి। తివిరి సంద్రముద్రచ్చగా।
సవనహర దానియందు। గరళంబు ప్రభవిల్లి ॥సి॥ 34

సదినదంబులనెలను। చుట్టుకొని నరుల సురలను గాల్చెనూ।
అదరిపడరుషివనములకు। బడియూర్చె యంతటను ॥సి॥ 35

పొదరిండ్లలోనున్నయు। మునివంశ। పుంగవులు నెల్లనదిరీ।
విదితముగమీసన్నిధి। జేరియు। వేడగనుసిద్ధే॥ 36

ఆపదోద్ధారకుడవైనావిధీ। నరసి। కష్టములెల్లను।
బాపితివిగిరిజకూను। తెలియంగ। బల్కి శ్రీసిద్ధే॥ 37

రక్షించుమనిపల్కగా। నీవుఘన। రక్షకుడనాదువంచూ।
దాక్షాయణీవంపెనూ। నినదయ। గీక్షచేసిద్ధే॥ 38

అటివిషమునుగాంచియు। దయగల్గి। పట్టుకొనిమ్రింగినీవూ।
దిట్టతముగనిల్పితివి। గళమందు। దీపింపసిద్ధే॥ 39

పరమాత్మరూపుడావు। పరమేశ। పరహితుండవునీవెగా।
పరగనీమహిమలెన్నా। దరమానే। పరమేశ ॥సి॥ 40

అంతరంగుడవగుచును। అన్నిటను। ఆత్మనీవైయుండగా।

వింతగాఘాయుబోలు | యీలోకమంతయును ॥సి॥ 41

దిశలందు గగనమందు | నిండుకొని | తేజరిల్లుప్రకాశము |
వశమా నెఫణివిభునకు | వర్ణింప వరదశ్రీ ॥సి॥ 42

మాయాప్రపంచంబును | జేయగను | మాయకాడవుసీ వెకా |
పాయకనురక్షింపవే | నీపాద | భక్తుడను ॥సి॥ 43

సాధులాసాంగత్యము | నిరతంబు | సమబుద్ధులకనుగాని |
వాదభేదములెన్నడీ | వారికీ | వశమానె ॥సి॥ 44

కోటిమంత్రార్ధంబులు | నీమంత్ర | సాటియానాయాధరకా |
పాటింపనీనామము | బహురుచి | పరమాత్మ ॥సి॥ 45

మోహాసంసారంబను | సుదధియం | దూహచేబడద్రోయకు |
ద్రోహుడనుకేన గాను | నన్నేలు | ధూర్జటి ॥సి॥ 46

చిక్కులనుబెట్టకయ్య | నీస్మరణ జేసెదనునేనిరతము |
మక్కువతోరక్షింపవే | తేరాల మహాదేవ ॥సి॥ 47

పరులవేడినపొట్టకూ | కూడుకె ఫలితంబెగాని మరియు |
నిరతంబునినుదలంప | కోరతేమి నిటలాక్ష ॥సి॥ 48

కదలిచూతఫలంబులునీనామ | మంకలీరుచిగలునా |
పొందుగామమ్మేలుమా | నీకృపాపూర్ణముగ ॥సి॥ 49

యెన్నివిధములగాంచిన | వేకుకలోనన్ని వస్తువులునునా |
యున్ననీమహాత్మ్యంబునూగన్గొనగ | యొప్పనె ॥సి॥ 50

నిర్వికారనిరంజననిర్వికేశ | నిష్ప్రపంచుడనగుచును |
నిర్వాలిప్తుండవగుచు | నిత్యమును సలచెదవు ॥సి॥ 51

మాహేశ్వరుండవనుచు | నిన్ను నామననమునందున నిల్పితి |
సాహసంబున | జేసిన దుష్కృతిము సర్దవే ॥సి॥ 52

జలబుగ్గలనుబోలెడు | యీమేను మలమూత్రములను |
గూడి వలనొప్పనరశల్యముల్ | నవరంధ్రములనుండు ॥సి॥ 53

యెండవానలకోర్వను | యింకానెనయీ శరీరంబుచూడ |
నిండి వెల్లుచునుండునూ | నీపదము పంచుపలె ॥సి॥ 54

వ్యుత్కటకములుగాను | సిభక్తముఖ్యులూ జగమునందు |

చిక్కులలజెందబోకా । వెల్గుదూరు స్థిరముగా ॥సి॥ 55

బంధుజాలము లెల్లనూ । జీవుండు బాధలోనుండంగను ।

ముందుగతిగానలేరూ । మునిహృదయ సదనశ్రీ ॥సి॥ 56

తల్లిదండ్రియున్నన్నలు । స్నేహితులు తమ్ములును భార్యహితులు

యెల్లవారునుగాంచగ । బోవుదురు యెప్పుడో ॥సి॥ 57

మందమతినీనేనునా । కొందమున ముదమొందగా ।

సుందరాత్ముడవగుచున । భువిని నినుజెందితిని ॥సి॥ 58

కాననంబునవిజయునీ । గెల్వంగ కదలియుద్ధముజేయగా ।

మేనుభువిపైనిబడెను । శ్రీమత్స గానగా ॥సి॥ 59

అట్టిమత్సయుజూపితీ । నీసతికినట్టి ఫల్గుణుడంతటా ।

పట్టెనీపదపద్మముల్ । కురెరిగి పరమాత్మ ॥సి॥ 60

నీమహిమలెన్నగాను । దరమగునె నిటలాక్ష పార్వతీశా ।

సామజాసురమారణా । ననుబ్రోవు సరగునను ॥సి॥ 61

సర్వభూతంబులాకు । నివుదగ సాక్షివై వెలుగొందుచూ ।

సర్వమునునిండియుండె । నీరూపు సంతసము ॥సి॥ 62

కామాదిషడ్గుణములు । లేకనిరాకారుండవై నసీదు ।

నామరూపములెన్నగా । చాలనే నాగుండు ॥సి॥ 63

పంచభూతంబులైదు । నీలోన మించివెల్గుచునుండును ।

గాంచ యాత్మస్వరూప । ఫణిభూష కారుణ్య ॥సి॥ 64

కాలకింకరులనంగా । మహాదేవ చాలగాభయమొందితీ ।

మేలుగ నీనామముల్ । హృదయమున గీలుంచు ॥సి॥ 65

వాలాయముగనమ్మను । బ్రోవగను పాలాక్ష రావదేమి ।

నీలకంఠమహేశ్వరా । తేరాల నిటలాక్ష ॥సి॥ 66

క్రూరపాపుడ ద్రోహుడ । దుర్గుణుడ నేరంబులెంచక య్యా।

మేరుపర్వతకార్ముకా । యక్షేశ మిత్రశ్రీ ॥సి॥ 67

చాలగానినువేడితి । నామొరాలాలించవదియేమిరా ।

శైలధైర్యగుణాకర । నగవాస శ్రీలలిత ॥సి॥ 68

సచ్చిదానందస్వరూపా । పరిపూర్ణసత్యప్రకాశయాశ ।

సచ్చరిత్రుడవీవెగా । తేరాల సదన శ్రీసిద్ధేశ్వరా ॥ 69
చుట్టుప్రాకారంబును జెలువొంది నట్టడవిలోన నీవూ ।
దిట్టముగనిలచినావు । తేరాల పట్టునను ॥సి॥ 70
పంచశిరములయందున । శ్రీగంగ యంచితంబుగయుండగ ।
సంచితంబుల బాపవే । తేరాల సాంబశివ ॥సి॥ 71
వ్యాఘ్రిచర్మంబులూను । శశిధరా వసనంబులయ్యేనీకు ।
శీఘ్రింబుగనుప్రమథులు । యెదుటనిను సేవింప ॥సి॥ 72
చండీశభృంగీశులు । నిన్నుమది చెలువుగాగొలుచుచుండా ।
ఖండలవ్యోమకేశా । రక్షించు కరుణతో సిద్ధేశ్వరా ॥ 73
దండివిఘ్నేశుండును । నీయెదుట మెండుగావృషభుండును ।
నిండుమనమునసక్రందుడు । నిల్వగను దండిగను ॥సి॥ 74
యీరీతివెల్గుచుండ । నీకాంతి సూర్యునిబోలియుండ ।
ధీరత్వముననుంటివీ । గిరిజతో తేరాల ॥సి॥ 75
ఆలయంబునగల్గెడి । చిత్రింబు లంతిత యనగరాదు చాలు ।
స్తంభములుంచును । పనివరుస సరసముగ ॥సి॥ 76
ఒకచోటమణిసుంతుడూ । చండీశు డొకచోటభృంగీశులు ।
నొకచోట విఘ్నేశుడు । గొల్వగను యొప్పెదువు ॥సి॥ 77
త్రిదివముకు సరిపోల్చగా । వెలుగొందు దివ్యభవనముయచ్చట ।
ముదముననుయేకాంతమై । భక్తజన ముఖ్యులూ ॥సి॥ 78
ఆనందకందలితులై సందోహ । ఆత్మనాత్మవిచారులై ।
పూనివైరాగ్యంబును । జెందియును బుధులుండ్రు ॥సి॥ 79
అశాంతమునుమిమ్మును । హృదయమున అతిభక్తిచేనుండియు ।
ఆశ్రయించినగల్గును । మోక్షంబు అరలేక సిద్ధేశ్వరా ॥ 80
ఉండెనాలయమున । విభూతిగుండమున ప్రఖ్యాతిగా ।
నిండుమనమునయుండెను । వృషభుండుదండిగను ॥సి॥ 81
నలుదిక్కులకు స్నానముల్ । సేయంగ ననువైన సోపానముల్
విలసితముగల్గుచుండె । దానిగన విస్మయము ॥సి॥ 82
పర్వములయందునిన్ను । సేవింప సర్వోఘములు బాయునంచు ।

ఉర్వీజనంబులెల్ల । నీకడన యుండెదరు ॥సి॥ 83
అరయగోగర్భంబను । గుండంబు అదియు దేహం ।
బయ్యెనూ । విరివిగాంతజ్యోతిపీనీవగుచు వెల్గుదువు ॥సి॥ 84
శ్రీరామనామమెపుడు । పఠియింప శ్రీగౌరికిని దెల్పుచు ।
శ్రీరామనామసారం । గోలుచును తేరాల ॥సి॥ 85
అమనస్కములదెల్పుచు । మరియు నిరాకారమాసాంఖ్యమూ ।
క్రమముగాదెలుపుచుండ । వినుచుండుగౌరియు ॥సి॥ 86
శ్రీమహాతత్వార్థమై । మరియు విశేషానందమైతుర్యమై ।
సోమసూర్యాగ్నులనుమించి । తేజమై శుద్ధమై ॥సి॥ 87
ఆరక్షరంబుల । కూడియును హరుడనీవై యుంటివి ।
సారసోద్భవవందితా । పరమేశ సర్వమై ॥సి॥ 88
నాల్గక్షరములందునా । శ్రీమహా నారాయణుండనుచును ।
వెలుగునీవనువెరుక చే । యెరుగుదురు విమలులు ॥సి॥ 89
మణులహారమునందునా । దారంబు మాడ్కియీజగములెల్ల ।
నణిగియుండవెలంతరా । నీలోన నళినాక్ష ॥సి॥ 90
భూతేశశివశంకరా । హరదేవ ఖ్యాతిగానున్ననీవూ ।
ధాత్రినె యేరీతిగా । బ్రోచెదవో యీతరిని ॥సి॥ 91
నీదరికసనుసకోర్క । భక్తుండు పాదుగావచ్చుచుండ ।
ఆదారిలోరాక్షసుం । డుగ్రుడై యచ్చటను ॥సి॥ 92
ఆబ్రహ్మరాక్షసుండు । క్షుధచేత నాభక్తవరునిగాంచి ।
సంభ్రమంబునబల్కెను । యిట్లనుచు సాంబశివ ॥సి॥ 93
ఓయనఘునిన్నుభ్రమింగ । నేనిప్పుడాయ్యన నదుచుంచితీ ।
పాయకను నాయాకలి । దీర్చుకొని పోయెదనె ॥సి॥ 94
భీకరా కాపుడగుచు । దనుజుడు భీతిగలిగింపుచుండి ।
పైకిహుంకారంబునా । వచ్చుచును భక్తుగని ॥సి॥ 95
ఇట్టిసిద్ధేశ్వరముని । క్రవ్యాదు డిట్లుపల్కుచునుండగా ।
యెట్టుదోచక భయమున । దిగులొంది గట్టిగా ॥సి॥ 96
హాకృపాంబుధి వరదయో । రక్షించు హా జగత్కర్తవీవె ।

సిరుసమలిక । లేరయా పరమేశ లోకమున ॥సి॥ 97
నీవాదిక్కనినమ్మితీ । నినుచాల కావుమనుచునువేడితీ ।
భావమున దలపోయవే । తేరాల భర్గహర ॥సి॥ 98
నన్నుబ్రమింగగవచ్చెను । శంకరా నిన్నుగాంచగరాగను ।
పన్నగాహారబోధ్రివ । త్వరితముగ బైల్దేసు ॥సి॥ 99
అచ్చాధ్రతువాక్యంబులు । యాలించి యాభీమనాముకంత ।
వచ్చెక్రోధోదగ్రుడై । చీకట్లు విచ్చగను ॥సి॥ 100
కరమునను త్రిశూలము । ఫణిభూషలురమునను వెల్గుచుంచ ।
శిరముగను విభూతియు । ఫాలమున దిద్దియును ॥సి॥ 101
కోటిసూర్యులకాంతిచే । వెలుగుచును మేటిగంగనుధరించి ।
దీటుగనుప్రమథులెల్ల । గొల్వగను ధాటిగా ॥సి॥ 102
వృషవాహనారూఢుడై । పార్వతీ విషధరుండేతెంచియు ।
నిశచరుంజంపగాను బైల్దెరె । నిటలాక్షు ॥సి॥ 103
దితిసుతుంజంపుకోరకూ । నరసింహదేవుండువచ్చినట్లు ।
పతితపావనమూర్తిౖనై । యాదైత్యువధియింప ॥సి॥ 104
త్రిశూలమునునేయగా దైత్యుండు । దీనుడైదశరూపముల్ ।
వశముదప్పియుపడియెను । యసురుండు వసుధపై ॥సి॥ 105
హరిణాంకధరరూపుడై । మ్రొక్కుచును పురహరునియెదుటమిగుల
స్థిరమొప్పగను పరచెను । తన దివ్యదేహంబు ॥సి॥ 106
భవములెల్లను బాపగా । జేసినా శివనీమహాత్మ్యమెన్నా ।
దివిజనాథునకైనను తరమౌనె । తేరాల సిద్ధేశ్వరా ॥ 107
దుష్టరాక్షససంహార । హరయీశ శిష్టజనపరిపాలక ।
విష్ణుమిత్రమహేశ్వరా భూతేశ । వీరశ్రీ ॥సి॥ 108
భక్తకల్పతరువహ । శ్రీమహా పరిపూర్ణచిత్కళాపా ।
భక్తసంతుష్టుడవు । తేరాల వాసశ్రీ ॥సి॥ 109
కామితార్థములొసగవె । కైలాస ధామశంకరయీశనా ।
స్వామినీవని నమ్మితీ । తేరాల సాంబశివ ॥సి॥ 110
పరమాని సురపూజితా । నిరతమును పరమాత్మ ।

రూపుడావు స్థిరముగానీపాదముల్ । సేవింతు వరమివ్వ ॥సి॥ 111
పరమేష్టి శౌనకాదీఋషి.వరులు । ప్రస్తుతింపగనిరతము ।
వరములిచ్చెడివాడవు । తేరాల వాసశ్రీ ॥సి॥ 112
జన్మముండెడువరకును । నీసేవ జేయుచుండుచు నెప్పుడు ।
నిన్మానసమునందునన్ దల్చెదను । నిక్కముగ ॥సి॥ 113
ధనమదంబునకొందరు । నిన్నెపుడు మనమునన్ స్మరియింపరు।
గనసీస్వరూపంబును । తెల్యకను గర్వమున ॥సి॥ 114
నీరులోపటిమీనము । ఆశచె నెరుగకను మాంసమనుచు ।
ధీరగాలమునందునన్ చిక్కుపడి । దీరునటు ॥సి॥ 115
పూః నీయెడభక్తియు । యేమైనగానుపించదు చూడగా ।
మానవాధములకెల్ల । వ్యవహారమార్గంబె ॥సి॥ 116
అరయసంసారంబను । మోహాంధమను గర్తమునమునిగియు ।
దరియుగానక అంధులై । దిర్గుదురు దాక్షేక ॥సి॥ 117
మలమూత్రముల బెరిగినా । యీకాయ మందుగల్గిన మోహము ।
వలనొప్ప నీమాయయే । తేరాల నిలయశ్రీ ॥సి॥ 118
కొవ్వుమాంసము రక్తము । గలిసి యీగూడిసటువంటి దేహము ।
నివ్వటిలు మోహంబును । నీవెగద నీలగళ ॥సి॥ 119
కామమోహములనెల్ల । వదలినీ నామమును పఠించినా ।
కామితార్థములొసగవే । తేరాల ధామశ్రీ ॥సి॥ 120
శశిశృంగదోషంబులు । లేవుసీ క్షేత్రమునందునసగాంచగా।
శశిధరామమ్మేలుమీ । పార్వతీ శ్వర దేవ ॥సి॥ 121
ఎందుజూచిననుగానీ । మహాదేవ సందులేకను వెల్గుచూ।
పొందుగానిండియుండె । నీరూపు పూర్ణముగ ॥సి॥ 122
చూడబడువస్తువులు । నవియెల్ల శూన్యంబుగా దెభువినీ ।
త్రాడుసర్పముదీతిగా । లోకముల్ దనరెశ్రీ ॥సి॥ 123
కలదులేదన్నందుకు । సాక్షిగా నిలచితివి శశిధరేంద్రా ।
వలనొప్పనీకడకును । ప్రభలుజెన్నలరశ్రీ ॥సి॥ 124
బండతోజనులు బహుగ । నీకడకు యిండ్లకడనుంచి వేగా ।

కండ్లారనినుగాంచగా । వచ్చెదరు కాలగళ ॥సి॥ 125
స్నానములు చేయుచుండి । నీరూపు శ్రావ్యముగనుభావించుచు ।
మానసంబుననెన్నుచు । యుందురురు మనుజులట ॥సి॥ 126
అభిషేకములు జేయుచు । కొందరూ హరహరాహరయనుచును।
సభలుచేయుచునుందురు । నీభజన సల్పుచును ॥సి॥ 127
పత్రిచే పూజింపుచు । నినుమిగుల ప్రార్థనంబులు జేయుచు ।
నేత్రోత్సవంబుగాను । వేడెదరు నినుజనులు ॥సి॥ 128
నిగమాంతగోచరుడవు । నీమహిమ బొగడనావశముగాదు ।
సగుణనిర్గుణుడ వగుదువు । తేరాల సాంబశివ ॥సి॥ 129
త్రైమూర్తులును నీవెగా యీమహిని తలపసర్వమునీవెగా ।
మముగావవే శంకరా । తేరాల మదనహర ॥సి॥ 130
గరుడగంధర్వాదులు । నినుమిగుల నిరతమునుగొనియాడగా ।
స్థిరముగా రక్షింపవే తేరాల వరదశ్రీ ॥సి॥ 131
కేవలాతీతుడవుగా । నిన్నెంతు భావమందునరాగదే ।
సావధానమనస్కుడనై । నన్నేలు సాంబశివ ॥సి॥ 132
పరిపూర్ణమనియు । నినుమిగుల ప్రాజ్ఞులెల్లనుబల్కగా ।
అరశినీరూపమేను । దలచెదను ఆత్మలో ॥సి॥ 133
అశ్రద్ధచేయకయ్యా । నాపైమొరా లాలించి రక్షింపవే ।
అశాంతమును గొల్చెద । తేరాల హరశివా ॥సి॥ 134
శరణుశరణయ్యలింగా । కారుణ్య శరణు శ్రీశంభులింగా ।
శరణు జేసెదనీకును । మాంపాహి కరుణించు ॥సి॥ 135
సర్వశుభములుగల్గియు । పార్వతీ సతినుతులు ముప్పాలొల్క ।
సర్వతవాసభర్గ రక్షింపు ప్రార్థింతు ॥సి॥ 136
రూపులాదేవిశక్తి । నీసరస ప్రాపుగానిలచియుండే ।
కాపాడిరక్షింపవే । తేరాల గౌరీశ ॥సి॥ 37
నీభక్తవరులపైన । శంకరా నెనరుయుంచగరాదటే ।
నీభక్తిచేనుండితీ । తేరాల నిలయుత్రి ॥సి॥ 133
భువినిరాయువరంబునా । నిలచియు భవనీదుకరుణచేత ।

కవియనుగ్రహపాత్రుఁడా । తేరాల గరకంఠ ॥సి॥ 139
ధరనుగుగ్రము కోటయు । భక్తుడగు । వరకవిని ననుబ్రోవగా ।
స్థిరముగాసంశయంబే । తేరాల దేవశ్రీ ॥సి॥ 140
సిద్ధేశ్వరంబనూ క్షేత్రమున । శివరూపకళలచేత ।
శిద్ధీశుడనజెల్లవే । తేరాల సిద్ధాప్త ॥సి॥ 141
ఆచంద్రతారార్కమై । బ్రహ్మాండ మాద్యంతముల వెల్గెడు ।
నీచందమును తెల్యగా । వశమానె నిటలాక్ష ॥సి॥ 142
యీశతకమును నిత్యము । పఠియింప యిష్టోపభోగంబులు ।
యీశనీకృపబొందగా ।వరమొసగు యీశ్వరా ॥సి॥ 143
ప్రకటితంబగు నీకృతి । పఠియింప భవహర మోక్షమబ్బు ।
సకలకామ్యంబులెల్ల । ప్రాప్తించు సరగునను ॥సి॥ 144
మంగళముసిద్ధేశ్వరా । యిదెనీకుమంగళము గౌరీశ్వరా ।
మంగళము శుభదాయకా । శితికంఠ మంగళము సిద్ధేశ్వరా॥ 145

క॥ సిద్ధేశ్వర యీశతకము। శుద్ధంబుగ సంస్మరింపశుభ సౌఖ్యంబుల్ ।
శిద్ధించుజదివిన్రాసిన । శిష్టులకును గల్గుమోక్షసిరులీభువిలోన్

మంగళహారతి.

హారునకు మదనసంహారునకు జలధిగంభీరునకు పన్నగాహారునకును ఘోరపాపములనూ భూరిమేఘంబుల బారద్రోలినయట్టి పవననకును॥ జయమంగళం నిత్యశుభమంగళం॥ మంగళముగురునకు మహాదేవశంభునకు మంగళముకైలాస మందిరునకు । మంగళము సురనుతమహితచారిత్రునకు । మంగళము పార్వతీమన్మథునకు । జయమంగళం॥

భీమునకు వరపరంధామునకు । సోమునకు సామజాసురచర్మచేలునకును । యీమహామాసింద్రిఅభినుతోన్నతునకు । భూమచిదానందపూర్ణునకును । జయమంగళం నిత్యశుభమంగళం ॥

హరశివాయనుచు నిన్నాశ్రయించెడిభక్త । వరులబ్రోవ్రు యీశ పరమపురుషా ॥ స్మరణజేయుచునుండు సత్పురుషులనుగాంచి । కరుణజూచెడి గంళకంఠనీకు ॥ జయమంళం ॥

ధరణియందున రాయవరమునన్ వెలయుచు। హరుడగు శ్రీసాం

బుడాదరమున| కరుణతో డుతమమ్ము గాచుశంకరుడని| మరువకను నిరతంబు మదిదలంతు ॥ జయమంగళం ॥

హరుడైన శేషార్యయాత్మజుండగు చిదం। బరుడెపుడు బోవ్రు తక్ మరుపులేక। స్థిరముగా తమపాదసేవకుండగు నట్టి పరకోటయాఖ్యని వరదునకు ॥ జయమంగళం ॥

—: పద్యములు :—

క॥ శివశతకమటంచునుయిది | శివసంస్మరణంబటంచు సేవింపబడున్
శివయని నీనామంబును | శివశివయని పఠనసేయ సిద్ధించుసిరుల్ |

క॥ హరయన పాపములెల్లను | హరియించునుమంగళములు|
హరశివయనినన్ | హరుడెరిగించెను పార్వతి | కిరవందగ
తారకంబు హేతువులోలయన్ ॥

క॥ గావున హరశివనామము | కేవలముగప్రథమ జపముకీలెరుగంగన్|
ధీవరులును సిద్ధేశ్వరు | భావంబున గాంచవలయు పండితవరులై ॥

క॥ ఎంతనిదెలిపెదయికయే | చింతలులేకున్న పదము శివపదమనుచున్ |
సంతోషమున రచించితి | సంతసమున మెచ్చవలయు
సరసగుణాఢ్యుల్ ॥

గీ॥ ఇంతకన్నమిగుల యిహపరంబికలేదు । గురుపదంబుదక్క
గోప్యముగను | సద్గురుండునైన సచ్చిదంబరమూర్తి |
యెరుకపరచినట్టి యెరుకగనుడు ॥

శివదండకము.

శ్రీదేవదేవాచిదానందరూపా మహేశా శివా దండశూకంబులన్ పొందుగా వక్షమందుందిరంబొప్పగన్ | దాల్చియున్ | శీర్షభాగంబునంగంగయున్ చంద్రుడున్ | అబ్జకోటీరహారుద్రమువ్మేలుమీ |పూర్వమందాది యంతంబులున్ లేక నేకంబవై వెల్గుచున్నుండగా | నంతనీయందునన్నొక్క శక్త్యుద్భవంబొచు | సర్వప్రపంచబు బ్రహ్మాంశచే జేయ రక్షింపగానీవు విష్ణ్వంశచే బెంపగా | శంభుహంశంబునన్ దుంగగాజేయగా బ్రహ్మవైయుండి దుర్మార్గముల్ వృద్ధిపొందన్ననేకావతారంబులన్నెత్తుచుండంగ నీలోకమందీకలిన్దుష్టులన్ వృద్ధి

నైనట్టి । శివాశర్వమాహేశ శంభోపినాకీభవారుద్ర । భూతేశ్వరా యంచు బ్రహ్మాదులుట్టి నేడగాయిప్పుచిద్వ్యోమ నామంబునంబట్టి దుర్మార్గులంజంపి సన్మార్గులం బ్రోచినా నీదురూపంబు । వాఙ్మానసాగోచరంబౌనుగాదే చిదాకాశరూపా । వివేకుల్ నినుంగాంచి యావిశ్వమున్నిండియున్ దేనియున్నంటకన్ వెల్గుచున్ లోకమంతం సదానీదురూపంబుగానెంచుచున్ తామునీవౌక్కడుంగా మనంబందు భావింపుచుందృందరూపంబులుం గానకన్ సర్వమున్ జేయుచున్ । జేయునట్టున్ ప్రకాశింపుచున్ పుణ్యపాపంబులన్వీడి । యేభావనల్లేకనాభావమందే । సదాయుండుచున్ । వెల్గుచున్ నంధకారంబుకంటెన్ నతీతంబుగానున్న చిద్వ్యోమమందున్ లయంబొందుచున్ తిర్గిరాకుందురో దేవ దేవానమస్తే నమస్తేన్నమః ॥

—: యాలలు :—

యెందూబోడా గానారావు యేమానందు నారీమణీ । పొందినీతోభ్రాంతితీరదూ । ఓహోహో భార్యామణీ సందిరుముల బాపువేగామే ॥ 1

వినుమూనాథా కోటాయార్యా విస్తరింతూ నాదూవిధము మానసమునానుంచబోకుమూ । ఓహోహోకోటయార్యా । నీదుకోర్కెలన్నివృధయేగా ॥ 2

కోర్కెలెట్లు వృధయూసుమ్మి కోరీయున్ననిన్నుగాంచ కొర్కెదీరా యేమిసేయుదు । ఓహోహో నారీమణి। కారణములేకిట్లుజరిగెనూ। 3

నీటిపైనబుగ్గ విధమూనిలచియున్న దేహములు । సాటియనుచుగురుడు దెల్పెనే ఓహోహోకోటాయార్యా మాటికింకా సంశయంబేలా ॥ 4

సంశాయములేదుగానీ । సాంగత్యముమరువనీదూ । హంకదోలగిపోయియుండెగా। ఓహోహోనారీమణి। సంశయంబే భ్రాంతిదోలగెగా॥ 5

అయిదుఆరు అబ్దమూలు ఆనందమునన్నినుగూడి । హాయిజెందిమనము యుంటిమీ । ఓహోహో కోటయార్యా । ఇయమెల్ల నిట్టివిధమెగా ॥ 6

విధిచెగలిగే విధములన్నీ । విరివిగాను దెలశినేను । విదితముగనుని ల్చియుంటినీ| ఓహోనారీమణీ| హృదయమూనాపరము గాంచుచు॥ 7

అట్టిపదము అచలూలాకు అమరీయుండుటది సహజమె| పట్టియున్నా ముదా్రివిడువకు। ఓహోకోటయార్యా । స్పష్టముగను నిలచియుం డుమూ ॥ 8

భ్రాంతియెట్లు విడచూసీను భ్రమయుదీరాదామెనాదు స్వాంతము నామరువాజాలనే| ఓహోనారీమణి| కాంతనీదూప్రేమాకెటులోర్తు॥ 9

కామామోహామూలూనెల్ల కడకూజిమ్మి నీవుపరంధాముని మది నమ్మియుండుమూ| ఓహోకోటయార్యా కామితార్థమూలు లొసగు శంభూడూ ॥ 10

యేవిచారములులేకా నెలుగుచున్నాగానీ। నేనూ నీవిచారమూగ లిగియుండెను । ఓహోనారీమణి । దైవకృతమునిట్లు జరిగేగా ॥ 11

జరిగీనట్టికార్యమూలూ జనుగబోవుకార్యమూలూ మరువాకాను విధియేతూనినమ్ము । ఓహోకోటయార్యా గురుడు చెప్పినట్టిమాట నిజమగాను ॥ 12

గురుడెబ్రహ్మా పరమాపదము గురుడె సచ్చిదానందము । గురుని మహిమాతెలియ తరమానా । ఓహోనారీమణి । కోరికాలు విడచీ యుంటినీ ॥ 13

చూడాబడులోకములు శూన్యమనుచు బల్కుశృతులు తాపిదుప ర్వాభ్రాంతియనుచూను| ఓహోకోటయార్యా | మూడుకాలములూ నీవెసత్యమూ ॥ 14

నీదూరూపు సౌందర్యముకూ | యెటులూసురచియుండెదాను | పా దుగా | నీభ్రమకు నెటులోర్తు| ఓహోనారీమణి| వదలిపోదూమో హాజాలము ॥ 15

రూపానామమూలు భ్రాంతి రూఢిగాను నీవెసత్యమూ| చావుకో ట్ట మోహజాలము| ఓహోకోటయార్యా చూపునీలోజేర్చి యుండెదా ॥ 16

శ్రీచిదంబరుగురునీ కరుణా । స్థిరమతిసైనా నీవూ । భాస

మానమయినాపదమందు । ఓహోహో నారీమణి । దాసురాలవైయ్యు యుండుమా ॥ 17

ఐక్యామొందీయుంటిగానీ । ఆత్మయందూనిన్ను మరువా । లౌక్య మనగరాదునామాట । ఓహోహో కోటయార్యా సౌఖ్యమైన పదము యీతోఁ్రివా ॥ 18

నిర్వికల్పాబ్రహ్మ పదకేవనిశ్చయంబని శృతలుబలుకా । సర్వమందు బ్రహ్మపదమేగా । ఓహోహోనారీమణీ । సర్వమయుని గాంచుచుం దూమా ॥ 19

విభవనామవత్సరమున శుభఫాల్గుణశుద్ధమందు । అభయ ఏకాదాశితిధియందూ । ఓహోహో కోటయార్యా విభవముగనుముక్తి జెందితి ॥ 20

మాలలు సంపూర్ణం.

—: పద్యములు :—

సీ॥ చంద్రబింబముగాకు । పద్మమైనవదనంబు । కాంతిభాస్కరుబోలి ।
గాంచుమోము । పరగసౌందర్యంబు । భంగిసనేకము ।
మితిలేనిమార్గులు । మిగులుచుండు । అంధకారంబును ।
వణచువెలుతురు । భాతి । వికసించు కాంతినాయబల నెన్న ।
సుదతి భక్తిను మాలు । శోభిల్లగను సదా
శాంతసుశీలను । జేయుదుము ॥

ఆ॥ అట్టివణతిని బోలనీయవనిమందు । సాటిలేరని చెప్పగాజెల్లుధాత్రి।
నారినామంబు । లచ్చమ్మనామమొప్పి । మాలలనువిని
సంతృప్తియందెయుబలం ॥ 1

క॥ ఆపణతిస్తణంబులు । శ్రీపతిసతిసిరికి మిగిలి । సేవింపబడున్ ।
కోపింపరానిమొఖమై । సీపింపగ స్వర్గనాథు । దిశ కేగెమరిన్ ॥ 2

క॥ ఆ నారీమణి శ్రీగురు । స్థాన చిదంబరమహాత్మ్యగని హృదయమునన్ ।
దానందెస్మరణజేయుచు । కానంగనే మోక్షసిద్ధిగాంచెముదమునన్ ॥ 3

ఉ॥ పాపములంటద్రొక్కి । పతిభక్తివివేకమునందు నిల్చియున్ ।
రూపములెల్ల । మిధ్యయని రూఢిగనమ్మి మనంబునందునన్ ।

శ్రీపతియైన । కృష్ణభగవానుల । రుక్మిణిగొల్చు భంగిగా ।
యీపణతిమెలంగు లౌక్యముల । నెన్నతరంబె ।
మహీస్థళంబునన్ ॥ 4

క॥ గావునయీపద్యంబులు । భావంబున నరసిగురుని । పాదాబ్జంబుల్ ।
కేవలముగగాని యాడితిధీ వెలయగనన్ను బ్రోవు ధీవరులెల్లన్ ॥ 5

క॥ యీపద్యంబులువ్రాసితి । శ్రీపతి శ్రీరామచంద్ర సిరిసౌఖ్యంబుల్ ।
ప్రాపింపగోరియుండెద । నీపాదము । లాశ్రయింప నిరతము నేనున్ ॥

క॥ శ్రీసద్గురు కృపవలనన్ । వాసిగ తేరాలయీశ । వాసుడుయైనన్ ।
శ్రీసిద్ధేశ్వరు నెప్పుడు । భాసితముగ । గొలుతునాదుభావ్యములోనన్ ॥

గద్య.

ఇది శ్రీమద్వారణాశి చిదంబర గురుస్వాములవారి ప్రియశిష్యుండును,
సకల సుకవితాపాత్రుండును, నిఖలసుజన మిత్రుండును,
ఆంధ్రాఋషి గోత్రోద్భవుండును, పద్మశాలీ కుల
సంభవుండునూ ఐన గుర్రము వీరయ్య
తృతీయ పుత్రుండగు కోటయాఖ్యకవి
ప్రణీతంబగు శ్రీ తేరాల సిద్ధేశ్వర
శతకంబు సర్వంబు
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

## వివేకచంద్రికలు  వివేకచంద్రికలు

| | | |
|---|---|---|
| 1 [illegible] | శ్రీకుసుమహరనాథ ఠాకూరు | [illegible]—0 |
| 2 [illegible] | శ్రీమత్ వివేకానందస్వామి | 0—[illegible]—0 |
| 3 [illegible] | " " | 0—2—0 |
| 4 గృహస్థాశ్రమ ధర్మము | శ్రీరామ తీర్థస్వామి | 0—2—0 |
| 5 [illegible] | " " | 0—2—0 |
| 6 [illegible] | శ్రీమత్ అభేదానందస్వామి | 0—2—0 |
| 7 శ్రీరామకృష్ణ, వివేకానందులు | M. V. L. నరసింహారావుగారు | 0—2—0 |
| 8 భగవద్బోధములు | భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస వారి యుపదేశములనుండి | 0—2—0 |
| 9 [illegible] రహస్యము | ... ... ... ... | 0—2—0 |
| 10 యోగసాధన | శ్రీఅరవిందయోగి | 0—3—0 |
| 11 ఇంద్రియ నిగ్రహత్వము | మహాత్మాగాంధీ | 0—2—0 |
| 12 భగవద్గీతామృతము | శ్రీశర్మగారు | 0—2—0 |

ఈ పుస్తకములన్ని కొనువారికి రు 1-2-0 లకే, యివిలభించును. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

ఈ పుస్తకములు దొరకుచోటు——

### శ్రీరామకృష్ణ పూజామందిరము,

కొత్తపేట, గుంటూరు.

---

# భక్తి ప్రబోధిని.

## భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

## శ్రీకుసుమహరనాథ ఠాకూరు

## శ్రీమత్ స్వామివివేకానంద

## శ్రీకృష్ణచైతన్య మహాప్రభు

మొదలగు మహనీయుల చరిత్రలను వరుసగా ప్రచురించు మాసపత్రిక.

48 పేజీలు సం॥ చందా రు 1—0—0 మాత్రమే.

## శ్రీరామకృష్ణ పూజామందిరము, గుంటూరు.

